

# సకిరిశతకము.

ఇది

కాశింకోట నివాసులును

అనకాపల్లి మ్యూనిసిపల్ హైస్కూలు

తెలుఁగు పండితులు నగు

న్యాపావఝ్ఝల సత్యనారాయణమూర్తిచే

రచియింపఁబడి

(బ్రహ్మశ్రీ

బులుసు పాపయ్యశాస్త్రి)గా

సవరింపఁబడి)

అనకాపల్లి: సూర్యముద్రాయంత్రమున ముద్రింపించి

గ్రంథకర్తచే ప్రకటింపఁబడినది.

**1924**

శ్రీ

# చక్రిశతకము

ఇది

కాశింకోట నివాసులును,

అనకాపల్లి మ్యూనిసిపల్ హైస్కూలు

తెలుఁగు పండితులు నగు

న్యాసావఝ్ఝుల సత్యనారాయణమూర్తిచే

రచింపఁబడి

(బ్రహ్మశ్రీ

బులుసు పాపయ్యశాస్త్రి గారిచే

సవరింపఁబడి)

అనకాపల్లి: సూర్యముద్రాయంత్రమున ముద్రింపించి

గ్రంథకర్తచే ప్రకటింపఁబడినది.

1924

 [వెల, రూ 0-2-0

గీ. జీవిత జగాల సంశ్రాద్ధి-శీతకరుండు,
శ్రేయచారిత్రకుండు నా-రాయణుండు,
చక్రిశతకంబు ప్రియుదణా-సల్పకతన
మెచ్చి చిర-జీవితత్వము- నిచ్చుఁ జక్రి.

గ్రంథములు వలయువారు,
న్యాసావధ్యుల జానకిరామశర్మ,
కశింకోట.

అని వ్రాసి తెప్పించుకొనవచ్చును.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

అస్మద్గురుభ్యోనమః

# చక్రిశతకము.

కం. శ్రీగౌరీహృదయేశుల
బాగుగ నే మదిని దలఁచి-భక్తియుతుఁడనై
సాగిలఁబడి నుతియింపుదు
వేగమె రక్షించుకొఱకు-వేడుచుఁ, జక్రీ. ౧

కం. కలిఁజెలి చనినమార్గము
గల దని కవివరులనుతుల-కై యిగ్గిగ్గన్
లలిఁ జొచ్చు పలుకు చేసియు
దలమును సాగింపుఁ; గృతిని గైకొన, జక్రీ. ౨

కం. గణనాథుని భజియించెద
గణ మొసఁగఁగ విఘ్నతతిని-గూల్చి ప్రోవన్
గణములు పెం పొనఁగూర్పఁగఁ
జణాజణాలాడుచును గృతి పొసంగఁగఁ, జక్రి. 3

కం. కరి నినుఁ బ్రార్థింపఁగ నా
దరమునఁ గష్టక్రి బాధఁ-దప్పించినశ్రీ
ధర నీ కీకృతి నొసఁగెద
నరమర చేయక గ్రహింపు-వరా ధృతిఁ, జక్రి. ౪

కం. శ్రీరాములఁ దలఁచెద నేఁ
గారుణ్యముతోడ నన్నుఁ-గాచుటకొఱకై
భారము ని మదిని దలఁచక
పారకటాక్షంబుఁ జూపు-వసుధను, జక్రి. ౫

కం. పతితుల నాహృదయంబున
పతిభక్తిఁగ, రామ, నిన్ను-ననిశముఁ గొల్తున్
క్షితిఁ బాపుఁ బనుచు నెంచక
పతితులఁ బ్రోచుచుంట-న్యాయము, చక్రీ. ౬

కం. నీవే జననీజనకులు,
నీవే నామిత్రులంచు-నెంచితి మదిలో,
నీవే నాతోఁబుట్టులు,
నీవే నాదైవ మనుచు-నిత్యము, చక్రీ. ౭

కం. చనవలె నడచినపదకట
గనవలెఁగద నీదురూపు-కడు ధైర్యమునన్
వినవలె నీపలుకులు ధర
మనవలెఁ గద నిన్నుఁ గొలిచి-మానుజుఁడు, చక్రీ. ౮

కం. సత్యము పల్కను సరి కద
సత్యం బన నేమొ యెఱుఁగ, సర్వగుణాఢ్యా,
అత్యంతము నావాదిలో
నిత్యము,నిన్నుఁ గొల్చుచుందు.నిజముగఁ,జకీ) ౯

కం. ముచ్చిలి వేదంబులు గొని
చెచ్చెర నాసోమకుండు-సింధువ్రఁ జొరఁగా
నచ్చదువ్రలఁ దెచ్చితివిగ
మచ్చెమ వయి యసురఁ జంపి.మహిలోఁ,జకీ) ౧౦

కం. చదివిన చదువులు దలఁచినఁ
జదువఁగఁ లే దింపు కైన-సద్గ్రంథంబుల్
చదివినవఱకుం గొంచెపుఁ
జదువ్రలలో నిన్నె చాలఁ జదివితిఁ,జకీ). ౧౧

కం. ఏరా, దశరథుకొమరుఁడ,
రారా, నను( బ్రోతు వంచు-రంజిలుచుంటిన్
ధీరుఁడ వని నిను నమ్మితి
కారుణ్యముఁ జూపి నన్నుఁ-గావుర, చక్రీ. ౧

కం. రామా యనియెడినామము
నేమానవుఁ డైనఁ గాని-యెలమిని దలఁపం
గా మాడుఁ బాపపుంజము
లామానవుఁ డొందు స్వర్గ-మరయన్, చక్రీ ౧

కం. ఇడుమలు వచ్చిన రానీ,
విడువరు నీభక్తి నెప్పుడు-విశ్వములో సం
గడి మీఱు నీసుభక్తులు
కడు ధైర్యముతోడ నీదె-కల దని, చక్రీ. ౧౪

కం. విదురుం డిచ్చిన దెయ్యది
మదగజ మేపాటి నీకు-మణు లన్నోనఁగ నా
రదుఁ డేకానుక లిడెఁ సేఁ
జదివించనికట్లు మొద్ది జగతిం జక్రీ. ౧౫

కం. ఇందఱకుఁ గానవత్తువె
యందఱవలె నేను గాన-యువని స్న్హకున్
ఎందులకు దాఁగెదవు రా
సుందర మాగునీమూహ్పుఁ-జూపక చక్రీ. ౧౬

కం. మన్నవుటూహాల నడచుచుఁ
గర్మంబులు భువిని నేను-గడియించితి నే
ధర్మంబులఁ జేయుచు నీ
కర్మంబులఁ బాపుకొనుట-గానను, జక్రీ. ౧౭

కం. ధర్మంబు ధర్మ మనియెడి
ధర్మవుపాశ్యంబు నెవుడుఁ దలపోయను గా
ధర్మముఁ జేయుట యది దు
ష్కర్మం, బని చాల బుద్ధిఁ గొరవలెఁ, జక్రీ. ౧౮

కం. నాహృదయగుహవ్యా స్త్రైపక
కావట్యముతోడఁ జెలఁగఁ గడఁగుదు నితరున్
పాపంబు చేయ వద్దనఁ
గోపరబున నేను విసుగుకొంటిని జక్రీ. ౧౯

కం. జలనిధి జాతుల నెవయ్య,
సులభంబవశాస్త్రములకు ట్లోశీనటంచును
దలపోసి ధర్మశాస్త్రో
క్తులు మొచ్చఁగ నెత్తి తౌర కుధరవర, చక్రీ. ౨౦

కం. కుటిలపుబుద్ధిని మెలఁగుదుఁ
గటకట! జన్మంబు నాకుఁ-గడతేఱుట నీ
దిట మగుపదవిని బొందుట
యెటులో నా కెవరుదిక్కు-యేమో, చక్రి. ౨౧

కం. కొఱగాని భాషణంబులఁ
జిరకాలము గడపివుచ్చి-చెడిపోకుండన్
హరినామము స్మరియింపుచు
నరనిమిషము మనుట వాసి-యవనిన్, చక్రి. ౨౨

కం. హరినామము స్మరియించిన
హరియించును పాప మనుచు-నార్యులనుటచే
ధర స్మరియించెద నిన్నున్
హరి, హరి, హరి, రామ, రామ, హరి, హరి, చక్రి.

కం. ఎవ్వాఁడు పోసెను జలమూల
నవ్వనములవృక్షములకు-నంబయుదరమం
దెవ్వాఁడు పెంచెను శిశువుల
నవ్వానిని నేఁ దలంతు- నాత్మన్ జక్రి. ౧౮

కం. ఎవ్వాఁడు సృజించె జగ మది
యెవ్వనిచేఁ బెంచఁబడెనో-యిమ్మనుజులు తా
మెవ్వనిఁ దలఁతురో యిహమున
నవ్విష్ణుని నేను దలఁతు- ననయము చక్రి. ౧౯

కం. అర్జునుఁ డణఁచెన కర్ణుని
దుర్జను లగు దుష్టమంత్రి-దుశ్శాసనులన్
సర్జరులు పడఁగ గడగడ
గర్జిత మగు నీకు డాక- గలుగక, చక్రి. ౨౦

కం. వానరము వార్ధి దాఁటుట
కాననములఁ బోవుటయును - గనుధైర్యమునన్
దానవ్రులం జంపుట యెటు
గా నగు నీదైన మహిమఁ - గాకది చక్రీ. ౨౭

కం. సుధ సురల కొసఁగఁ గాదే
విధుంతుదునిశిరముఁ ద్రెళ్ళ - వేయుట వారా
న్నిధి మథియించుట వెన్నునఁ
గుధరమ్మును దాల్చుటయును - క్షోణీ జక్రీ. ౨౮

కం. స్మరియింపరు నిను భక్తిన్
స్థిరమతులయి యొక్కగడియ - క్షితితలమందున్
వరదుఁడ వయి లోకంబులఁ
గరుణించుటకొఱకు నీవు - గలవని చక్రీ.

క౦. సుర లెల్ల వడఁక గడగడ
వరఁగ హిరణ్యాక్షుఁ ద్రుంచి- పంతముతోడన్
ద్వరగఁ బ్రపంచము గాచితి
వరాహరూపమున నీవు- వసుధం జక్రీ. ౩౦

క౦. శ్రీరాములఁ దలఁపరు మా
కేరాములు లే రటంచు- నెలమిని దుష్టుల్
ఏరాములు లే కుండిన
వీ రండలు మింటినుండి- వ్రేలిర చక్రీ. ౩౧

క౦. నారాయణ నినుఁ దలఁచెదఁ
గారుణ్యముతోడ నాదు- కాలుష్యంబు
న్భార మని మదిని దలఁపక
శూరత్వముతోడఁ గావఁ- జూడుమ చక్రీ ౩౨

కం. నారాయణ యనునామము
పారాయణసేయుచుండు-వారికి లక్ష్మీ
నారాయణుండు స్వర్గ
ద్వారంబును దెఱచియుంచు- బారుగఁ జక్రీ. 33

కం. శ్రీరాముఁడొసఁగుసిరులను
శ్రీరాముఁడు కోరుకొనఁగ-నిచ్చును వరముల్
శ్రీరాముఁ డొసఁగు వరపద
మారాముని మదిని దలఁతు-ననిశము, చక్రీ. 3౪

కం. నారాయణ. నారాయణ,
నారాయణ, యనుచుఁ దలఁచు-నవతతి శ్రీ నేఁ
గూరిమి సలుపుదు నెక్కువ
నేరము తన్నేసి యున్న- నెంచను జక్రీ. 3౫

క౦. రామా, రామా, యని నే
నేమూలలను వెదకుకొన్న- నెక్కడ లేఁడే
ఏమో, సర్వము నీవా?
యే మని నీరూపమహిమ- నెంతును? జక్రీ. ౩౬

క౦. ఇదియా నీ దగు రూపము,
వద వధ నీదొంగతనము- బయలుపడెనురా,
యిదిగో ని న్నిఁక వదలను,
మదిలో నా కున్న చింత- మాసెను, జక్రీ. ౩౭

క౦. నరు లెంత హాస్య మాడిన,
హరి,హరి, యని మ్రొక్కుచుందు- హర్షింపక నేఁ
జెఱకునకు వంక పుట్టినఁ
జెఱుచని యానాఁటితీపు- క్షితిలోఁ జక్రీ. ౩౮

కం. హరినినుఁ దలఁచినతోడనె
దురితంబులు వారయ కుండఁ- దొలఁగవరె నీ
పరమహిమ చేత, నిండుగు
బురదన్ హరింపుంచునట్లు- పొల్పుగఁ, జక్రీ. ౩౯

కం. తనయుఁడు హరిని భజించినఁ
గని శిక్షించెడి హిరణ్య-కశిపుఁ దునుముచున్
మును ప్రహ్లాదునిఁ బ్రోచిన
ఘననరసింహాండ వీవు- కదరా, చక్రీ 40

కం. ఏకథలు పుణ్యతమములో
ఏకథలను గాతమాడు- లెపుడు నుతింత్రో
ఏకథలు విష్ణుఁ జాటునో
యాకథలె పఠించుచుందు- ననయము చక్రీ. ౪౧

కం. ఏచరితలొసంగు శుభములు
ఏచరితల విష్ణుమూర్తి - యెపుడు వసించున్
ఏచరితల మేలొదవునొ
యాచరితల చదువుచుండు - నాశన్ జక్రి. ౮

కం. కరమెత్తి హరికి మ్రొక్కంగ
దురితమ్ములు మమ్మువిడిచి - దూరమ్మరుగున్
సిరి హెచ్చుగల్గు నని భూ
సురులనువాక్యంబు వినమె - క్షోణిని జక్రి. ౯

కం. కరములు కలిగిన మనుజుఁడు
పరగంగా పూజ చేయవలదే హరికిన్
హరికిన్ మ్రొక్కుట గాదా
శిరమున్నందుకు ఫలమ్ము - క్షితిలోఁ జక్రి. ౧౦

కం. హరి నీ కెఱుఁగని శిరమును
హరి నినుఁ బూజింపనట్టి- హస్తంబులు శ్రీ
హరి నినుఁ దలఁపని మనమును
మఱి మఱి తలపోసిచూడ- మ్రాఁకులు చక్రీ ౪౭

కం. హరి యను రెండక్షరములె
హరియించు నఘమ్ములనుచు- నార్యులసెప్పఁ
హరి నెన్నఁడుఁ దలఁపని ము
ష్కరులకుఁ బాపంబులెట్లు- సడలును జక్రీ. ౪౮

కం. దేవాసుర భండనమున
దేవత లారక్కసులను- దెగటార్చుట యో
దేవా! నీకృపచేఁ గద
దేవతలకు నీవె ప్రాపు- తెలియఁగఁ జక్రీ. ౪౯

కం. ఎన్నెన్ని మొఱ్ఱ లిడినను,
మన్నింపవు నన్ను నీదు-మానసమునజనుల్
వెన్నందురు నాపాలిట
నెన్నఁగవజ్రమయమయ్యె-నేమొకొ చక్రీ. ౫౮

కం. ఒదవును సిరి సంపదలును,
వదలును దుఃఖంబులెల్ల-వసుధస్మరుపకున్,
మది సందియంబు నుంచక,
వదలక నిను దలఁచునేని-పలుమఱు చక్రీ. ౫౯

కం. భూపకుఁడగు బలి యింద్రః,
భూవలయంబంతవడఁక- బూనికఁ దఱుమన్,
గావుమని నిన్ను వేఁడిన,
దేవేంద్రున కభయమిచ్చి తివిగద చక్రీ. ౬౦

కం. ఉన్నాఁడా జగదీశుం,
డున్నాఁడా సృష్టికర్త-యుండిన నేఁడీ
ఉన్నాఁ డున్నాఁ డనియెద
రెన్నఁడు కట్టెదుటఁ జడఁడ-దేమో చక్రీ. ౧౧

కం. లేఁడా దీనుల పాలిటఁ,
లేఁడా హరిభక్తు లందు-లేఁడా శ్రీశుం,
డేఁడీ కవిజనముల యెడ,
రాఁడా వెనుగలఁడా లేఁగా-రయమునఁ జక్రీ. ౧౨

కం. శాశ్వత మాభార్య ధరన్,
శాశ్వతమా పుత్రబంధు-జనములు పలఁపన్,
శాశ్వతమా యాతనువులు,
విశ్వంబేమిథ్య యండ్రు-విబుధులు చక్రీ. ౧3

కం. చక్కని బాల్యము నందే,
మక్కువ తో దైవభక్తి-మప్పుటవలదా,
మొక్కపుడు వంచకుండిన,
నెక్కుడు మ్రాసైన వంచు-టెట్టుల చక్రీ. ౧౪

కం. మొదల నినుదెలిసి వేఁడుట?
పిదపను దెలియంగ గోరి-వేఁడుట? పీనన్,
అదిమేలా? ఇదిమేలా?,
మొదటను నుడివినదికాదె- ముఖ్యము చక్రీ. ౧౫

కం. కోపము కూడదు నరునకుఁ,
గోపంబది మంచి మంచి-గుణములఁ జెఱుచున్,
కోపమును జంప కుండిన,
బాపంబులు పెరుఁగునండ్రు ప్రాజ్ఞులు చక్రీ. ౧౬

కం. విడవలె కోపము మనుజుఁడు,
విడుచుచుఁ బన్నగము పొరను-విడిచిన రీతిన్,
దడయక యిహపరముల లోఁ,
బడయఁగ వలెనండ్రు సుఖము-ప్రాజ్ఞులు చక్రి. ౧౭

కం. తలఁపక మది దశరథసుతుఁ
గలకాలము మనుటదేల-కాకము రీతిన్
చిలుకల వలె రామాయని
మెలఁగుటగడియైనమేలు-మేదినిఁ జక్రి. ౧౮

కం. తెలిసియు శౌర్యము కీర్తియుఁ
జెలఁగినచో నొక్క పూఁట-సిరి యది చాలున్
కలపొట్ట బోసి కొనుటకు
గలకాలము మనుటలేదె?-కాకముఁ జక్రి. ౧౯

కం. రెండు పదులొక్క మాఱును
భండనమున క్షత్రియులను-బాఱఁదఱుముచుఁ
జెండితివి కార్తవీర్యుని
వెండియు, భువి పరశురాము-పేరిటఁ జక్రి. ౬౦

కం. అర్థము స్పర్ధలకొఱకే
వ్యర్థముగా గోష్ఠి గొఱక-వ్యసనము కొఱకే
పార్థుడుకష్టసికొఱకే
యర్థియగుట పొట్టకందు-రార్యులు చక్రి. ౬౧

కం. తనకున్న నింద్రపదవియుఁ
దనకును లేకున్నలోక-దారిద్ర్యంబే
తనతోనె జగము కలదని
యును వారిన మూఢులందు-రార్యులు చక్రి ౬౨

కం. వినవలె గురువుల మాటలు
కనవలె మాటాడు ముందు-కడుదూరంబుగ్
జనవలె పెద్దల త్రోవల
మనవలె ఋణబాధ లేక-మనుజుఁడు చక్రి ౬౩

కం. మితభోజనమ్ము సుఖదము
మితనిద్ర సుఖమ్మొసంగు-మేలొసఁగు నిలన్
మితధన కాంక్షయు నారయ
మితిమేలును నమితికీడు-మేదినిఁ జక్రి. ౬౪

కం. వద్దందురు జారత్వము
వద్దందురు దుష్టమైత్రి-పరికింపంగా
వద్దందురు జూదమ్మున్
వద్దందురు చోరబుద్ధి-నరులకుఁ జక్రి ౬౫

కం. దహనంబును దక మార్పను,
సహనాతీతమగునట్టి;-జ్వరమును మందుక,
బహుళక్షుధ నాహారము,
మహినెయ్యది యార్పనేర్చు-మార్గ్యము చక్రి. ౬౬

కం. ఇల్లా కటు కాలు నిప్పన,
కల్లుంగొాన నేని చెడును-ఖలుఁడొక్కండే
ఖల్లుక మొకనినె చంపును
చల్లఁగ కులమెల్ల ఋణము-చంపును జక్రి. ౬౭

కం. దెబ్బకు నొకఁడేయెడ్చెడు,
దెబ్బలితనకనులముందు- విడిసిన నొకఁడే,
జబ్బాదవిన నొక్కండే,
డబ్బాడిన నెల్లరింట-తవరవ చక్రి. ౬౮

కం. నీటను గడిగిన వస్తువులు,
గాటముగా దేజరిల్లఁ-గలిగిన రీతిన్,
బాటించిన నిను మేమిల,
తేటయగున్ మనముమాకుఁ-దెలియన్ జక్రీ. ౧౯

కం. దశరథునకుఁ దనయుఁడవై,
దశకంఠుని సంహరించి-ధరవేల్పులకున్,
యశమును సుఖము నొసంగితి,
దశరథసుత నిన్నుఁ బొగడఁ-దరమా చక్రీ. ౨౦

కం. పంతములు పలుకవచ్చును,
జంతువు లెంతటివి యయినఁ- జంపఁగవచ్చున్,
గొంతు నులుపవచ్చును నీ,
చింతన మొనరింప భరము- క్షితిలోఁ జక్రీ ౨౧

కం. అనయము నిన్నే తలఁచుచు,
ననిశము నీనామమనెడి- యమృతరసంబున్,
దనియక త్రావెడినరుఁడే,
కనురా నీపదవి వేగ-ఘనుఁడై చక్రి. ౨౨

కం. ఏనరుఁడు నిన్ను దలఁచునొ,
తానే నీవనుచు నీవు- తానే యనుచున్,
మానసమున నినుఁ గాంచునొ,
యానరుఁడే కాఁడె తన్మ-యాత్ముఁడు చక్రి ౨౩

కం. శ్యామలము బాల గణపతి,
యీమొదలగు సప్తకోటి- యిలమంత్రములన్,
రామమును మించఁగలవా,
నేమమతో జపము చేయ- నేర్చినఁ జక్రి. ౨౪

కం. మాతండ్రి కలిమి దలఁచియు,
మాతాత బలంబు నెంచి-మదినుప్పొంగన్,
ఈతనువు ముక్తిఁ జెందునె,
ప్రీతిమెయి న్నిన్నుఁ గొలిచి-వేఁడక చక్రీ. ౭౫

కం. పద్దులు లేక ప్పిచ్చుట,
ముద్ధులు వద్దన్నచోట-ముఁపించుటయున్
పెద్దలను గేలి సేయుట,
వద్దనెదరు భూమి లోనఁ-బ్రాజ్ఞులు చక్రీ. ౭౬

కం. గుఱిలేని బ్రహ్మవిద్యయు,
సురపతి లేకుండ నేలు-సురలోకంబున్,
ధర లేక పండు పంటయు,
హరి చింతన లేనిపూజ-వ్యర్థముచక్రీ. ౭౭

కం. పాపమ్ములు సలిపితినో,
తాపము చే రామనిన్నుఁ-దలఁపనయితినో,
పాపపు గాథలు మూఁడెను,
గాపాడుము నాదుతప్పు-గాయుచుఁ జక్రి. ౨౮

కం. ఖలులగు కౌరవు లందఱు,
తలపడి జూదమున భువిని-ధర్మజుఁ గెలువన్,
బలుపార్థుల చేరణమున,
నులిమించినవాఁడ వీవె-నూర్వురఁ జక్రి. ౨౯

కం. కనవలె నీరూపంబును,
వినవలె నీపుణ్యకథలు-వీనుల తోడన్,
మనవలె రామాయనుచును,
తనువుండిన కాలమంత-ధారుణిఁ జక్రి. ౩౦

కం. ద్రౌపదిని బ్రోచె నెవ్వఁడు,
కాపాడు మటంచు నేడ్వ-కాకాసురునిన్,
కాపాడిన వాఁడెవఁడా,
శ్రీపతి యే నాకుదిక్కు-క్షితిలోఁ జక్రీ. ౭౧

కం. ఆపదలు పొందము వేళను,
పాపపు పనులకును మనము-వంగెడి వేళన్,
ఏపగు నీ నామంబే,
దీపము మై లైనత్రోవఁ-దెలుపఁగఁ జక్రీ. ౭౨

కం. రణమున భార్గవుఁడోడున,
వనమున బెనురాతిబండ-వనితగ నగునా,
వనచరుఁడు జలధిదాటునె,
ఘనముగ నీ వలనిశక్తి-గలుగక చక్రీ. ౭౩

కం. శిష్టుల రక్షించుచు మఱి,
దుష్టాత్ముల నణఁచి పుణ్య-దోషఫలంబుల్,
కష్టము తోఁబంచెదవఁట,
నష్టము లాభమును నీవు-నరులకుఁజక్రీ. ౮౪

కం. కరిమకరుల చరితమునసె,
యరసితి నీ ధర్మమును ద-యామహిమమ్మున్,
విరిదాఁపఁదానిదాఁగునె,
కరుణాన్ని రూపుఁజూపు-కాంచెదఁజక్రీ. ౮౫

కం. పగచే వగచేనైనను,
బెగడొందెడి ప్రాణమందు-ప్రియమున నైనన్,
జగదీశుని నినుఁదలఁచినఁ,
దగఁడా మానవుఁడు నీదు-దయఁగనఁజక్రీ. ౮౬

కం. యోగములానే నెఱుఁగను,
త్యాగము చేసిన్నుఁ గాంచ - ధైర్యములేదే,
యాగము లనెన్నఁ డెఱుఁగను,
మూగవలె న్నిన్నుఁదలఁచి - మ్రొక్కుదుఁ జక్రీ. ౮౭

కం. అజ్ఞానుఁడపామరుఁడను
సుజ్ఞానుల మహిమఁగనని - శుంఠను నాకున్,
విజ్ఞానముఁ గలిగింపుము,
ప్రజ్ఞానిధినన్నుఁ బ్రోవు - వరదాచక్రీ. ౮౮

కం. పరమడిగిన చెల్లెలికిని,
తఱిఁగని కామిత మొసంగి - తనివిని గొలుపఁగా,
ధరణీతలమున వెలసిన,
హరివౌ బుద్ధుండవందు - రార్యులు చక్రీ. ౮౯

కం. అరచుచును నోటి తోడను,
సురుచిరమగు నీదు పేరు-సొంపొదవంగన్,
తరచంగా రుచిహెచ్చెను,
మరలదు రుచివీడినాదు-మనమోచక్రీ ౯౦

కం. నరుఁడని చులకన చేయక,
వఁరగినరుచినుండి మనసు-మరలక యుండన్,
తరుణమును మించనీయక,
త్వరగా నీ కరుణ జూపఁ-దగునుర చక్రీ. ౯౧

కం. హరినామము జనులకు నఘు,
హారమగునను శ్రుతులపల్కు-లాలింపంగా,
ధరలో నెవ్వరు చనెదరొ,
పరుగున, నీదయకు వారె-పాత్రులు చక్రీ. ౯౨

కం. కాలుఁడు దూతల నంపెడి,
కాలమ్మున గఫము పేరి. కంఠముఁగప్పఁ,
దూలుచు శ్రమ నినుఁబిలువఁగ,
పిలగఁనో కాదో యిపుడె-పిలుతును జక్రీ. ౯౩

కం. ఏలాపలు పలుకులు ధరఁ,
గాలం బేరీతి నాకుఁ-గడపినఁగానీ,
కాలము తీఱెడికటినను,
గాలుని చేఁజిక్కకుండఁ-గావుముచక్రీ. ౯౪

కం. యమలోకబాధవినవి,
భ్రమఁజెందెడు నాదు మనము-బాగోయోగో,
సుమినిను శరణముఁజొచ్చితి,
క్షమియింపుము మ్రొక్కినొసఁగి-కావుము చక్రీ ౯౫

కం. రతనమ్ముల నిమ్మంటిన,
వితయుఁగు కామ్యార్థమేమి-వేడితినో క్కో,
కుతిలపడఁ జేయఁ జూచిన,
క్షితిలో నీతోడఁ దగవు-సిద్ధము చక్రీ. ౯౬

కం. గుహుఁడెట్టి పాత్రఁత చుట్టము,
రహిమీఱఁగ శబరి యెంత-పాత్రిణమొ నీకున్,
అహహా; వీరేమట్టల?
సహచరుఁడను నేనుగాన?-స్వామీ, చక్రీ. ౯౭

కం. అయ్యాయనో, బాబోయనో,
తియ్యని మాటలను ధరను-దేనెలొలుకఁగాఁ,
జయ్యనఁ బ్రార్థింపుచునీ,
నెయ్యము సాధించుటెట్లొ-నేర్పితిఁ జక్రీ. ౯౮

కం. కరివరదా, దామోదర,
సురరక్షక, నీలకాయ- సోమకవైరీ,
సుభుగ్గణ సంహారా,
నరసింహా, నన్నుఁగావ- న్యాయము, చక్రీ. ౯౯

కం. స్థలపతి మ్లేచ్ఛుఁడు కాఁగాఁ,
గలయంగా జాతులన్ని- కాంచి కరుణాతోఁ,
జెలఁగెడి మ్లేచ్ఛుల నణఁపఁగ,
నిలఁగల్క్యవతార మెత్తు- దెన్నఁగఁ, జక్రీ. ౧౦౦

శ్రీధర, కేశవ, నరహరి,
మాధవ, కృష్ణా, ముకుంద, - మధుసూదనుఁడా,
భూధర, సంకర్షణ, శ్రీ
నాథా, ననుఁగావుమయ్యా- నగధర, చక్రీ. ౧౦౧

కం. మెప్పును బడయంగా నేఁ,
జెప్పెడి శతకంబుగాదు-చెప్పెద వినుమా,
యిప్పనికి బూనఁగోరుట,
తప్పకనీ దయను వడయ-ధరలోఁ, జకీ. ౧౦౨

కం. కృతులంచుఁగవులొసంగిరి,
శతకములనియిడిరినీకు-బహుభాగ్యయుతుల్,
కృతియో శతకమొ యెఱుఁగను,
శతమానము కట్నమనుచుఁ-జదివితిఁ, జకీ. ౧౦౩

కం. అనిశంబు నాదు శతకము,
వినినను జదివినను వారియ-భీతులు తొలఁగుం
ధనవృద్ధిధాన్యవృద్ధియు
ఘనపుత్రికపౌత్రివృద్ధి-గలుగును, జకీ. ౧౦౪

కం. శ్రీవత్సస గోత్రుఁడ,న్యా,
సావర్ఝుల వంశభవుఁడ-జగ్గయసుతుఁడన్
గావుము ననుదయతోఁడను
దేవా,సత్యాబ్ధి ఘుండ-దెలతుం, జక్రి. ౧౦౫

సంపూర్ణము.



ఏతద్గ్రంథ కర్తృ విరచితమే.

"అమూల్యరత్నము."

మైరావణ కథననుసరించి వ్రాసిన నవ్యకము (Novelette). అచ్చులోనున్నది.

వసంతయామినీస్వప్నము— షేక్స్పియరు మహాకవికృతమయిన— ఏమిడ్సమ్మర్ నైట్స్ డ్రీమ్ అనునాటకము ననుసరించి వ్రాసిన మనోహరమయిన తెనుఁగు నాటకము. భాష సలక్షణమయినను మిక్కిలి సులభము, మధురము. వెల రు0-12-0

ఈపుస్తకములు వలయువారు అనకాపల్లి, సూర్యముద్రాలయమునకు వ్రాసినఁ బడయగలరు.

